# రామరసం

రచయిత :

గిరసజ్ఞ. సాహిత్యవిశారద. శ్రీదాస.

మాధవపెద్ది చిన వేంకన్న,

M.A; B.O.L; (M.Phil.)

సంస్కృతోపన్యాసకుడు.

ప్రగతి మహావిద్యాలయము.

హనుమాన్ టేకిడి.

హైదరాబాద్.

# రామరసం

రచయిత :

గీరసజ్ఞ, సాహిత్యవిశారద, శ్రీదాస,

**మాధవపెద్ది చిన వేంకన్న,**

M.A; B.O.L; (M.Phil.)

సంస్కృతోపన్యాసకుడు,

ప్రగతి మహావిద్యాలయము,

హనుమాన్ టేకిడి,

హైదరాబాద్.

ప్రభాకర్ ప్రింటింగ్ ప్రెస్- చెరుకుపల్లి.

# కామాక్షి

కామాక్షి! తవ వందనం
దేవి! కామాక్షి!
తవ వందనమ్! —॥కా॥

కాంచీపుర మందిర వాసిని! దేవి!
సంచిత పాప వాగుర నాశిని! —॥కా॥

కామకోటి పీఠాధి వాసిని! దేవి!
కామమోహ లోభాది నాశిని! —॥కా॥

గిరసజ్ఞ హృదయాబ్జవాసిని! దేవి!
గీతజాత దోషాది నాశిని! —॥కా॥

# దివ్య జ్యోతి

కరుణించవే – ఓ మాతా!
కామాక్షీ దేవతా!
శివకామాక్షీ దేవతా!

నిరతము నిన్నే నామదిలో
నిజముగ నమ్మితినేనిలలో
కావగరావే మాతా!
కామాక్షీ దేవతా!
శివకామాక్షీ దేవతా!

కొలిచే వారికి దేవీ!
కొంగు బంగారమవై
కామితార్థముల నొసగే
కామాక్షి దేవతా!
శివకామాక్షీ దేవతా!

పతిదేహములో సగభాగమునీవై
ప్రతిదేహములో దివ్యజ్యోతివినీవై
దాక్షాయణీ! మా కృతులను
సాక్షిగ వీక్షించే కామాక్షీ దేవతా
శివకామాక్షీ దేవతా!

# లయ

రామా!
నీనామము నే పాడెద-
నిరతము తలచి
సర్వము మరచి ॥రామా॥

దీనుల బ్రోవగ వెలసిన వాడని
ధర్మము సత్యము నిలిపెడు వాడని ॥రామా॥

గీతము లేదు సంగీతము రాదు
రాగము తాళము అసలే తెలియదు ॥రామా॥

భావము గీతమై, ధ్యానము సంగీతమై,
మానస సాధన లయయే కాగా ॥రామా॥

# తన్మయం

అంతా రామమయం
జగమంతా రామమయం
ఈ........ ॥అం॥

గిరులూ ఝురులూ
ధరణీ తరులూ
లతలూ పొదలూ
విరులూ ఫలములు— ॥అంతా॥

మృగమూ పశువూ
పులుగూ పురుగూ
తృణమూ కణమూ
అణువూ క్షణమూ— ॥అంతా॥

నీవూ నేనూ
అతనూ ఆమే
మానవు లందరు
తేడా లేక— ॥అంతా॥

# లీల

శ్రీరామా! జయరామా!
ఓ శృంగార రామా!
అని తలచెదరా!
నను బ్రోవుమురా! — ॥శ్రీరామా॥

కౌశికు యాగము
కావగ చిననాడే
చనలేదో! ఖరదూషణుల
పరిమార్చగ లేదో! — ॥శ్రీరామా॥

గౌతము భార్యను
నాతిగ చెయలేదో
శివధనుసు విరిచి
సీతను గొనలేదో! — ॥శ్రీరామా॥

భార్గవ రాముని
శార్ఙ్గము గొనలేదో!
తండ్రి యానతి విని
అడవికి పోలేదో! — ॥ శ్రీరామా॥

రావణు వధియించి
సీతను తేలేదో!
హనుమను భువిపై
చిరంజీవిని చేయలేదో! — ॥శ్రీరామా॥

# శరణము

మోహన రాముని
చరణములే-శరణము మాకు

కౌసల్యా దశరథుల వాత్సల్యము
చూఱగొన్న మృదుచరణములే
శరణము మాకు

జానకీ దేవి ప్రేమను పుణికిన
జలజాత సనుకోమల చరణములే
శరణము మాకు

సుమిత్రా తనయుడు గౌరవముతో
సేవించిన సున్నిత చరణములే
శరణము మాకు

అహల్యా సతిని రాతి నుండి
నాతిగ చేసిన లలిత చరణములే
శరణము మాకు

శబరిని చూడగ కఱకురాలపై
నడిచిపోయిన పేశల చరణములే
శరణము మాకు

సామీరి మానస సరోవరమున
వికసించిన సుకుమార చరణములే
శరణము మాకు.

# నిశ్చయము

రాముని నమ్మిన వారి-
కెన్నడు నాశము లేదు
తెలియవె మనసా
సీతారాముని నమ్మిన - - -

సంసార సాగరమున పడి
మునిగి తేలే వారికి - - - ॥రా॥

కామ క్రోధ లోభాది
జాలమున గిలగిలలాడే వారికి - ॥రా॥

ధర్మము నిలుప న-
ధర్మము బాపగ
అవతరించిన
పురుషోత్తముని - - - ॥రా॥

—*—

# దిక్కు

రామా! నీకన్న వేరెవరురా
మము బ్రోచేవారెవరురా — ॥రామా॥

ఏకపత్నీవ్రతుడవు
పితృవాక్య పాలకుడవు — ॥రామా॥

నీ కొకటే బాణము
నీ దొకటే లక్ష్యము — ॥రామా॥

దుష్ట శిక్షణ
శిష్ట రక్షణ
చేయ నవతరించిన
ఆదిదేవుడవు — ॥రామా॥

## ఘనత

రాముడే నన్ను
కాపాడ వలెను -
ఇల నవతరించిన
ఆది దేవుడే నన్ను ---

తాటకను చంపి
తపసి జన్నము
కాచిన ఘనుడు
ఆదిదేవుడే రాముడు- --

రాతి రూపున నున్న
గౌతముని సతిని
పాదరజమున నాతిని
చేసిన ఘనుడు ---

శరణు వేడిన
విభీషణుని-అభయ
మొసగి దరికి
చేరదీసిన ఘనుడు ---

# దీపము

రాముని ధ్యానింప వే
ఓ మనసా! సీతా — ॥రా॥

మననములోన మలినము
మసలిన నిముసము — ॥రా॥

నీలో లోలోపల
వెలిగే జ్ఞానజ్యోతిని
నలుపైపులా కాంతి
వెలువరింప నీయుదూ! మనసా- ॥రా॥

చీకటి నూతిలోబడి
చీకాకు బడనేల ?
భక్తి దీపము చేగాని
దైవమార్గము గనవే - మనసా- ॥రా॥

# అంతర్యామి

రామా! నిను వేడెద
నను కాపాడమని -     ॥రా॥

మాయా జగతిలో బడి
యమయాతన పడుచుంటి
జ్ఞాన మొసగి నను నీ
దరి చేర్చుకో మంటి -     ॥రా॥

దేవ దేవుడవు నీవు
వేద వేద్యుడవు నీవు
సకల చరాచరములలో
అంతర్యామివి నీవు -     ॥రా॥

# సౌందర్యము

సుందరతముడే శ్రీరాముడు
అతిలోక ------

చంచరీక సమ చికురములవాడే !
అష్టమి జాబిల్లిబోలు లలాటమువాడే॥ ॥సుం॥

చెఱకు వింటినిబోలు కనుబొమలవాడే!
జలజాతదళసమ నయనాలవాడే ! ॥సుం॥

చంపకసుమ సమ నాసికవాడే !
బింబఫలముబోలు అధరాలవాడే ! ॥సుం॥

ఆజాను బాహుడే నీలమేఘశ్యాముడే
ప్రసన్న వదనుడే-ప్రసన్న వరదుడే! ॥సుం॥

# దీనబంధు

రామా నిన్ను నెఱ నమ్మితిని
నన్ను బ్రోవ రావేమయా!                    ॥రా॥

వ్యయప్రయాసల జీవనములో
అలసి సొలసి, విసివి వేసారితిని
చేయూత నొసగి ఆదుకొనుమా
మనసు నూరట నొసగుమా దీనబంధు   ॥రా॥

నీవుగాక మము బ్రోచువారెవరురా
దాశరథి! దయాశరధీ!
దీనబంధు! జానకిబంధు!
మారుతిబంధు! కరుణాసింధు!                    ॥రా॥

# అంత

రాముడు మా దైవము!
జానకి మా కల్పవల్లి!
సౌమిత్రి మా మిత్రము!
మారుతి మా ఊపిరి! — ॥రా॥

మీ అండ దండ మాకుండగా
భీతి చెంద పని లేదుగా
సర్వ కార్యములు తమకు తామె
సఫలముగా నెరవేరునుగా — ॥రా॥

అహంకార మమ కారములు
చంపుకోలేని మూర్ఖుడు
నేను నాది యనుకొనుచు
మిడిసి పాటు పడుచునుండు — ॥రా॥

—o—

# రామరసం

నిను కొనియాడగ
మా తరమా! రామా! -- ॥నిను॥

చతురానన షడానన
వాణీ ఫణీంద్రులు
నీ మహిమము తెలియగ
చతురులు కారనగా! -- ॥నిను॥

అహరహము మహాదేవుడు
హృదయారవిందము నందు
తారక మంత్రము -తన్మయుడై
జపించుచు నుండు ననగా -- ॥నిను॥

నారద తుంబురులు నాదసాధనలో
నామగానసార రసామృతపానము
ఈరేడు లోకాలు సంచరించుచూ
తనవితీరగ త్రావి పంచుచుందురనగా --॥నిను॥

—o—

# నమ్మిక

రాముని పాదము శరణము పొందిన
నాశము లేదని నమ్మిక మాటా

శరణము పొందిన
సుగ్రీవుని కొఱకు
వాలిని పరిమార్చగలేదో?
కిష్కింధకు పట్టము గట్టలేదో? ॥రా॥

శరణము పొందిన
విభీషణుని దరి చేర్చగలేదో
రావణుని జంపి
లంకకు రాజును చెయలేదో? ॥రా॥

చరణము కొలిచిన
పవనకుమారుని
చిరంజీవిని చెయలేదో?
భావిధాతయని అనలేదో? ॥రా॥

## కరుణా నీరదశ్యామా!

కాపాడుమయా! రఘునాయక!
మము కాపాడు మయా!
జననాయక! నిను—రామా!
శరణము పొందితిమయా!
కరుణా నీరదశ్యామా! ॥రా॥

నిరతము నీ నామము
నేమరక తలతుమయా!
దయయుంచి మాపయి
వరముల నొసగుమయా
కరుణా నీరదశ్యామా! ॥రా॥

సంసార దావానలమున
తాపమునెంతో పొందితిమయ్యా
కరుణా నీరదశ్యామా—రామా!
చల్లని చూపులు కురియుమయా! ॥రా॥

—o—

# నిత్యాభియుక్తి

మరువ బోకుమా! మానస హంసమా!
రాముని నామము - స్మరణము చేయుట!

ఘంటా ధ్వనిలో - నాదములన్నీ
ప్రణవ నాదము - పలికెడు విధము
రాముని నామము
భజనము చేయుట ॥మ॥

తైలధారలో - బిందువు లన్నీ
ఏకధాటిగా - జారెడు విధము
రాముని నామము
ధ్యానము చేయుట ॥మ॥

సాగర వారిలో - కెరటము లన్నీ
వరుసగ తీరము - చేరెడు విధము
రాముని నామము
సాధన చేయుట ॥మ॥

# తారకము

నీటిలో నావలా
సాగి పోనీ మనసు
భక్తిలో లీనమై
తేలిపోనీ మనసు ॥నీటి॥

తెరచాప పైకి ఎగురవేసి
చుక్కాని సూటిగ చూసినడిపి
అలలో- సుడులలో --
ఊగ కుండా- మునగ కుండా
దాటినటుల ॥నీ॥

రామ నామము- తలచి తలచి
భజనల్లో మనసు- మరచి మరచి
ఇహపర సాధనమై- దాటి నటుల
భక్తిలో లీనమై- తేలిపోనీ మనసు ॥నీ॥

# రక్తి

రామనామ స్మరణలోన
రక్తిగాంచు హృదయమా!

విషయసుఖముకొఱకునై
వ్రేల నేల! ధరణిలోన
క్షణికమంచు తెలియవా?
నశ్వరాలు - ఎఱుగవా? ॥రా॥

సంపాదన కలుగు నంతకే
సంతానము కాను నిన్ను
సుఖసంతస మొసగు నంతకే
చుట్టాలునుచూచు నిన్ను ॥రా॥

పెట్టుపోతలు జరుగునంతకే
పెండ్లామును మెచ్చు నిన్ను
పని పాటలు చేయనంతకే
పది పైసలు దొరుకు నిన్ను ॥రా॥

శారీరక బలము సడలినా
కాళ్లేతులు కదలమానినా
పైవారెవరు కనరు నిన్ను
నీ పాట్లిక నీకు తప్పవుగా- ॥రా॥

# జ్ఞానజ్యోతి

జ్ఞానోయీ-సాధకా!
నిజమోయీ-సాధకా!

నీలో వెల్గిన జ్ఞాన జ్యోతులు
రామ ధామము చూపించునురా!
పరంధామము చూపించునురా!

నిష్కామ కర్మ, నిస్వార్థ సేవ
విశాల ప్రేమ-ఆనందమురా!
పరమానందమురా!

త్యాగము చేయుము రాగము పాడుము
గీరసజ్జుడిక కనిపించునురా!
నీలో కనిపించునురా!



పేరు : మాధవపెద్ది చిన వేంకన్న
M.A., B.O.L.



తండ్రి : శ్రీ కనకరత్నం

తల్లి : శ్రీమతి సత్యవతమ్మ

జననం : 7-6-1941

విద్యాభ్యాసం : వేదాంత వర్ధినీ సంస్కృత కళాశాల, సీతారాంబాగ్
హైదరాబాద్

విద్యార్హత : B.O.L. (సాహిత్య)
M.A. సంస్కృత ఉ.వి.

వృత్తి : సంస్కృతోపన్యాసకులు, ప్రగతి మహా విద్యాలయం,
కోఠి, హైదరాబాద్
శ్రీ వేంకటేశ్వర వేదాంతవర్ధినీ సంస్కృత కళాశాల,
బేగంపేట, హైదరాబాద్

రచనలు : శ్రీ నీడిగొండ నృహరి సుప్రభాతం (సం)
శ్రీ వాసర సరస్వతీ సుప్రభాతం (సం)
శ్రీ పెనకయ్య మేలుకొలుపు (తెలుగు)
శ్రీ కీసర రామలింగేశ్వర సుప్రభాతం (సం)
క్వణత్కాంచి (తెలుగు)

ప్రవృత్తి : జ్యోతిషం, ప్రశ్న, వాస్తు, యంత్రప్రతిష్ఠ